ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow
@mohanpublications




- పోలూరి హనుమజ్జానకీ రామశర్మ

# ఆంధ్ర మహాభారత పురాణం

# ఆంధ్రమహాభారతపూరణము

వ్యాసములు, కథలు





రచయిత

పోలూరి హనుమజ్జానకీరామశర్మ B.A. [Hons]

(Retd. Head of the Telugu Department,
V. R. College, Nellore)

విమలానందభారతి పత్రిక
నుండి ఉద్ధృతము
(ప్రథమముద్రణ—250 ప్రతులు)

1988 : నవంబరు

విభవ : కార్తిక

# గ్రంథాంకిత పూజ్య దంపతీ

## పరిచయము

మా తండ్రిగారు పోలూరు వేంకటనారాయణరావుగారు. వారికి మా తల్లియగు వేంకటనరసమ్మ గారియందు దుర్మతినామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ అష్టమీ సోమవారము, క్రీ.శ.13.6.1921 తేది మా అక్కగారు హనుమత్ శేషమ్మగారు జన్మించెను. మా తండ్రిగారు ఆమెను ఎనిమిదవ సంవత్సరమున చోరగుడి వేంకట రామారావు గారికి ఇచ్చి కన్యా వివాహమును గావించిరి.

మా బావగారు చిలకలూరి పేట వాస్తవ్యులైన చోరగుడి సరస్వతమ్మగారు హనుమంతరావుగారు అను దంపతులకు ఏకైక సంతానము. చోరగుడివారికి సంగీతము అభిమాన విద్య. మా బావగారు కూడ ఉత్తరాది సంగీతమునందు ప్రవీణులై, వారి మేనత్త భర్తయగు కొప్పరపు సుబ్బారావు గారి ప్రేరణమున "హిజ్ మాస్టర్స్ వాయిస్ (His Master's Voice) అను కంపెనీవారి స్వరముద్రా ప్రతులకొరకు Gram Phone Records) కొన్ని పాటలను పాడి ప్రశస్తి నొందిరి. ఆయన ప్రభుత్వ సహకార శాఖయందు (Co-operative Department) పని చేసిరి.

1955 లో మా అక్కగారు స్వర్గస్థురాలైన తరువాత ఆయన ద్వితీయ కళత్రమును స్వీకరించిరి. ఆయన తుది దశలో, రామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్నగారు భద్రాచల రామునిపై రచించిన కీర్తనములను గానము చేయుచు తన్మయత్వము నొందుచు క్రీ. శ. 27-7-1982 తేది [illegible]

నగరాజకుమారిని చి॥ కొప్పరపు రామప్రసాదునకు ఇచ్చిరి. కాని ఆమె తండ్రి జీవించియుండగానే ఆయనకు [illegible] అకాలమరణము నొందెను. ఆమెకు ఇరువురు కుమారులు కలరు.

ఆయనకు ద్వితీయ కళత్రమునందు కలిగిన చి॥ సౌ॥ శేషు, చి॥ శేషగిరి సంతానవతులై యున్నారు.

పూజ్యులైన యీ దంపతులకు అల్పమైన యీ కృతి, వారు ఏ లోకమందున్నను, అనల్పమైన సంతోషమును కీర్తిని కలిగించు గాక !

నెల్లూరు,
5.12.'88.

ఇట్లు
పోలూరి హనుమజ్జానకీ రామశర్మ

# పీఠిక

శ్రీ వర్ధమాన సమాజమువారి యాజమాన్యమున నెల్లూరు పురమందిరమున 1969 సంవత్సరమున జరిగిన కవిత్రయ జయంతి మహోత్సవసభలలో 15-2-1969 తేది నన్నయజయంతియందు వదాన్య శేఖరులు కీ. శే. శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు నన్ను సత్కరించిరి. ఆ సందర్భమున చి॥ P. M. గోపాలాచారి M.A. వేంకటగిరి రాజోన్నత పాఠశాల (V.R. *H*igh School) విద్యార్థులచే నాచేత రచింపఁబడిన "భువనవిజయ" మను గోష్ఠినాటకములోని యొక యంకమును ప్రదర్శింపఁ జేసెను. దానిని తిలకించుచున్న శ్రీ రామిరెడ్డిగారు, "శ్రీకృష్ణదేవరాయలకు పూర్వమే రెడ్డి రాజులు కూడ సాహిత్యమును పోషించినారుగదా!" అని సాభిప్రాయముగా నాతో అనిరి. నేను కూడ, "నిజమే. ఎఱ్ఱాప్రెగ్గడను ఆదరించి అగ్రహారము నొసంగినవారు రెడ్డిరాజులే. ఆసంవిధానమును కూడ త్వరలో నాటకముగా రూపొందింతును" అని చెప్పితిని. అట్లే కొంతకాలమునకు "ఎఱ్ఱాప్రెగ్గడ" యను గోష్ఠినాటకమును రచించితిని.

1974 ఫిబ్రవరి నెలలో ఒకనాఁడు ప్రియమిత్రులు, సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ శ్రీ పూన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులుగారు, M.A., వ్యాకరణ విద్యాప్రవీణ చి॥ బండి విశ్వనాథము M.A., చి॥ మాచవోలు రాజశేఖరము B.A, B.Ed., చి॥ మల్లవరపు సత్యనారాయణ B.Sc. యును మా యింటికివచ్చి యుండిరి. వారితో ప్రసంగించుచు నాటకములో కొంతభాగమును వినిపించితిని. వారు దానిని అభినందించుచు, "ఆకాలమున స్వాములవారి యొద్ద పండితులు కవులు సంస్కృతమునఁ గదా వ్యవహరించుచుండిరి. కావున ఎఱ్ఱాప్రెగ్గడ కూడ వారితో సంస్కృతముననే సదా మాటాడి యుండవలె" అను నభిప్రాయమును వ్యక్తమొనర్చిరి. నే నప్పుడు. "నిజమే. ఎఱ్ఱాప్రెగ్గడ స్వామివారి యొద్ద సంస్కృతముననే మాటాడియుండును. కాని తెలుఁగు నాటకమున అన్ని పాత్రలు తెలుఁగుననే మాటాడినట్లు రచింపవలయునే కాని, ఆయా పాత్రలు, భిన్నప్రాంతములవారు విదేశీయులే యైనను. కనుక సహజములైన భాష

రితో మాట్లాడినట్లు భిన్న భాషా ప్రసంగములను ప్రవేశపెట్టినచో తెలుఁగు మాత్రమే తెలిసిన సామాజికులకు అవి అర్థము కావుగదా! బొబ్బిలి నాటకమున ఫ్రెంచివారు ఫ్రెంచి భాషలో తురుష్కులు తురుష్కభాషలో ప్రసంగించినచో ఆ ప్రసంగములు తెలుఁగువారి కెట్లు బోధపడును? అది తెలుఁగు నాటక మెట్లగును? కావున తెలుఁగు నాటకమున సంస్కృత భాషా ప్రసంగములను కూర్చుట సమంజసము కాదు. ఇంక ఆఘట్టమును విడిగా ఏకాంక రూపముగా సంస్కృతమున రచింపవచ్చును" అని చెప్పితిని.

అందులకు మిగుల సంతోషించి చి॥ బండి విశ్వనాథము, "మీరు ఆ ఏకాంక రూపకమును సంస్కృతమున ప్రధానముగా రచించుచు సాధారణ సామాజికులకు కొంత వఱకైనను బోధపడునట్లు పాత్రలలో ఒకఁడు మఱియొకనికి ఆ సంస్కృత ప్రసంగములలోని విషయము ఎప్పటికప్పుడు తెలుఁగులో చెప్పుచున్నట్లుగా కూడ రచింపుఁడు. దానిని మేము మా వేదసంస్కృతోన్నత పాఠశాలా వార్షికోత్సవములలో విద్యార్థులచేత ప్రదర్శింపఁ జేయుదు" మనెను.

తరువాత కొలఁది దినములలో ఈ రూపకమును రచించి వారి కొసంగితిని. చి॥ విశ్వనాథముతో కూడ, చి॥ రాజశేఖరము మొదలుగా ఇతరోపాధ్యాయులును విద్యార్థినీవిద్యార్థులకు దీనిని నేర్పుటలో మిగుల కృషిచేసిరి. ఈ యుద్యమమున, ప్రధానోపాధ్యాయుఁడు చి॥ K.V. రమణయ్య M.A., B.Ed. కూడ ఉపాధ్యాయులను విద్యార్థులను మిగుల ప్రోత్సహించెను. 30-3-1974 శనివారము సాయంకాలము శ్రీ మద్దాలి మల్లికార్జునరావు B.Com., L.L.B. గారి యధ్యక్షతయందు జరిగిన వార్షికోత్సవమునందు ఈ రూపకమును విద్యార్థినీవిద్యార్థులు చక్కఁగా ప్రదర్శించిరి.

దీనికి మూలమైన "ఎఱ్ఱాప్రెగ్గడ" నాటకము "విమలానంద భారతి" పత్రికయందు ధారావాహికముగా ప్రకటింపఁబడి 1977 లోనే ప్రకాశనము నొందినను, ఈ యేకాంక రూపకమును ముద్రించి ప్రకటించు యత్నము చాలకాలముగా జరుగలేదు. క్రిందటి సంవత్సరము దీనినిగూర్చి "విమలానంద భారతి" పత్రికా సంస్థాపకులు (పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ శ్రీ శ్రీ రామానంద భారతీస్వామివారితో పూర్వాశ్రమమున శ్రీ కొరుమంచి కొండలరావుగారు B.A., B.Ed. ; ఎఱ్ఱాప్రెగ్గడ నాటకమునకు కృతికర్తలు) ప్రస్తావింపఁగా తమ పత్రికయందు ధారావాహికముగా ప్రకటించుటకు అంగీకరించిరి. వారి సౌజన్యమున ఇప్పటి కిది గ్రంథరూపమున ప్రకాశనము నొందుచున్నది.

ఈ రూపక ప్రదర్శనమున కావ్యపఠన సందర్భమునందు తాళపత్రగ్రంథముల యాకృతిలో కాగితముల పుస్తకమును తయారుచేసి పాత్రధారులు ఆ గ్రంథమును చూచుచు కావ్యపఠనము గావింపవలయును.

ఈ యేకాంకరూపకము రూపొందుటకు ప్రకాశనము నొందుటకు కారకులైన పెద్దలకు నమస్కరించుచు ఆయుష్మంతులను ఆశీర్వదించుచున్నాను.

ఇది ఆకృతిచేత చాల చిన్నదిగా నుండుటవలన, ఇదివరలో ప్రకటింపబడిన "గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యమ్". "ఆలోచింపదగిన కొన్ని విషయములు" అను వ్యాసములను ఇతర కథలను చేర్చితిని.

నెల్లూరు
విభవ చైత్రశుద్ధ షష్ఠీ సౌమ్య
వారము, 23-3-1988.

సుకీర్తిదేయుడు
పోలూరి హనుమజ్జానకీ రామశర్మ

— * - * - * —

విషయసూచిక



.... .... .... .... ....

## —తప్పొప్పుల పట్టిక—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 28 | కంత్శ్వేర | కంతేశ్వర |
| 5 | 2 | క్ంతేశ్వరి | కంతేశ్వర |
|  | 3 | వారికి | దానికి |
| 6 | 26 | పర్పృ..తృతీయే | పర్వ..తృతీయే |
| 8 | 4 | పఠిత్ణ | పఠిత్వా |
|  |  | శ్రోత్ణ | శ్రోత్వా |
|  | 5 | రూ ష్పై | రూపై |
|  | 12 | పై మనన్య | పైమనస్య |
|  | 14 | దైను | దైన |
|  | 24 | అవహితాః | అవహితాః |
| 9 | 1 | పురాణము | పూరణము |
|  | 3 | దేవీ | దేవీం |
|  | 5 | సెప్పేద | సెప్పెద |
|  |  | దొల్ల | దొల్లి |
|  | 6 | తార్క్ష్యండును | తార్క్ష్యండను |
|  | 7 | యడగె | యడిగె |
|  | 12 | నపర | నప్పర |
|  | 22 | సౌఖ్యా | సౌఖ్య |
| 10 | 4 | లాలరన్ | లారన్ |
|  | 7 | వడుయు | వడయు |
|  | 8 | లొక | లోక |
|  | 11 | యాగ్ని | యగ్ని |
|  |  | బ్రభవింతు | నమభవింతు |
|  | 13 | నీనవ | నవవ |
|  | 18 | క్ష్యండు | ర్క్ష్యండు |
|  | 21 | శ్రుత | శ్రుతి |
|  | 28 | చంద్రకేతి | చంద్రికేతి |
|  | 29 | దేవ....చంద్ర | రేవ...చంద్రి |
|  | 31 | వదమ్ తాథై | పదమ్ తథై |
| 11 | 1 | శబ్ధోపి న్పృ | శబ్దోఽపి గృ |
|  | 2,4 | భట్టై | (13పు 14) భట్టై |
|  | 8 | ముక్తై | ముక్తా |
|  | 13 | [illegible] | [illegible] |
|  | 19 | మిరేల | మీరేల |
|  | 21 | ప్రయుక్త మవ్య | ప్రయుక్త మప్య |
|  | 23 | చహూ | బహూ |
|  | 24 | డువ్య | డన్య |
|  | 25 | యశశ్మ..రాజిత్ | యశశ్స..రాజిత |
|  | 27 | కలిః | కవిః |
|  | 28 | తధైవ | తథైవ |
|  | 29 | పార్యాయః | పార్యాదయః |
|  |  | ఏవ్య..జోత్స్నాష | ఏవ..జ్యోత్స్నాష |
| 11, 12 | పుటలలో | ఎర్రన | ఎఱ్ఱన |
| 12 | 8 | పేయ | వేయు |
|  | 10 | తావీత్ | తావత్ |
|  |  | సుష్టు | సుష్ఠు |
|  | 11 | గ్రంధా | గ్రంథా |
|  |  | ర్ణవపతీయ | ర్ణనమతీవ |
|  | 13 | కృర్తృమివ | కర్తృకమివ |
|  | 17 | విద్వరోష్ట | విద్వదోష్ఠ |
|  | 25 | తథైన | తథైవ |
| 13 | 11 | శిఖండ | శిఖాంత |
|  | 17 | పిత్ర | చిత్ర |
| 14 | 6 | ప్రావృబ్బయో | ప్రావృట్పయో |
|  | 19 | వేష్ఠ | వేష్ట |
| 15. 16 | పుటలలో | ఎఱ్రన | ఎఱ్ఱన |
| 16 | 21 | పంనమా | పంచమా |
| 1 | 14 | లిగి | కలిగి |
| 10 | 30 | పర్ణింప | వరింప |
| 4 | 9 | పాలయిత్వా | పాలయిత్వా |
|  | 27 | కొలకుయుగ్ర | కొలు కిగ్ర |
| 8 | 17 | అల్లో | కాలల్లో |
| 12 | 26 | పిడితుడును | పీడితుడను |
| 21 | 9 | మధ్య | మప్య |
| 23 | 11 | త్రిపు | త్రిపుర |

# ఆంధ్ర మహాభారత పూరణము

రచయిత:-పోలూరి హనుమజ్జానకీరామశర్మ. B. A. Hens

## నాంది

సూత్ర: (ప్రవేశించి)

శ్రీ విత్యు లైనమూల
స్థానేశ్వరరంగనాథ దైవతవర్యుల్
మానితముగ మీ కిత్తురు
నానారస పూర్ణతాభినంద్య శుభంబుల్ ॥

(సభ్యులపై పుష్పములు చల్లి)

విక్రమసింహపురీ సంస్కృతోన్నత పాఠశాలా వార్షికోత్సవ సమాగతులైన సహృదయమహాశయులకు మీ కెల్లరకును నమస్కరించుచున్నాను (నమస్కరించును)

నటుడు (ప్రవేశించి) బావా! బావా! పెండ్లి అంట కదా

సూ॥ (నవ్వుచు) ఎవరికిరా!

న॥ నీకు నాకు మన కందఱకును

సూ॥ నాకు కూడనా?

న॥ ఔను

సూ॥ ఈ మాట విన్నచో మీ అక్కయ్య అప్పడాలకఱ్ఱతో నీకు తప్పక పెండ్లి చేయును.

న॥ అది కాదు బావా!

సూ॥ ఏది యౌనో చెప్పుము

న॥ మన పాఠశాలవారు వార్షికోత్సవములో సరిక్రొత్తదైననాటకమును ప్రదర్శింపుడని మన సమాజమునకు ఆదేశించినారంటకదా.

సూ॥ ఔను అదియా పెండ్లి

న॥ సరే కాని; వీరికి కూడ ఈ క్రొత్త పిచ్చియేమి?

సూ॥ క్రొత్తపిచ్చి కాదురా! క్రొత్తదనము కోరుకుంటిచ్చి, క్రొత్తదనపు పిచ్చి

న॥ మీ పండితులతో వచ్చిన చావే యిది. మాటమాటకు వ్యాకరణమే

తెగగఱుంగ నాటి మాటికి దువ్వుచునే యుందురే

న॥ అబ్బ! అది పోనియవయ్యా! దుంపత్రెంచుచున్నావు. ఇంతకును ఈ నాటకములో క్రొత్తదన మేమిటి?

సూ॥ పూర్వనాటకములతో పోలికయే లేకుండుట

న॥ అనఁగా. నాయికానాయకులు

సూ॥ ఉండరు

న॥ శృంగారము

సూ॥ ఉండదు

న॥ ఒక్క మధురగీతమైన

సూ॥ ఉండదు

న॥ పోనీ ఒక్క క్షత్రియుద్ధమైన

సూ॥ ఉండదు

న॥ శృంగారము లేదు. వీరము లేదు. మరి ఏమున్నదయ్యా!

సూ॥ సాహిత్యగోష్ఠి యుండును

న॥ (ఆశ్చర్యముతో) సాహిత్యగోష్ఠియా? దానితో ఒక నాటకమా?

సూ॥ ఔనురా! ఏల యుండరాదు? భువనవిజయము చూచితివి కదా! అది బాగుండలేదా?

న॥ ఓహో! అటువంటి నాటకమా! ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినదిలే! దానిని రచించిన పోలూరి హనుమజ్జానకీరామశర్మగారే! "ఎఱ్ఱాప్రెగడను" గూర్చి నాటకము వ్రాసినారని విన్నాను.

సూ॥ అదే మన మిప్పుడు వేయుచున్నది

న॥ అమ్మ బాబోయి అంత నాటకమే

సూ॥ భయపడకుము. నాటక మంతయు కాదు.

న॥ అందులో ఒక యంకమా

సూ: అంకము కూడ కాదు.

న: నాటకము కాక, అంకమును కాక ఇంకేమి వేయుదుము.

సూ: ఆ నాటకములో ప్రథమాంకమున ఒక సన్నివేశములో ఎఱ్ఱనగారు స్వాముల వారితో పండితులతో మాటాడుదురు. ఆ సన్నివేశమును మనవారు కోరఁగా ఆ కవిగారే ఒక చిన్న రూపకముగా రూపొందించినారు.

న॥ అలాగా! అటులైనచో మన దుంగ్రతెంగి వారు సంస్కృతమున మాటాడగ

న: అట్లయినచో బావా ఇది నిజముగా అపూర్వమైననాటకమే

సూ॥ ఎందువలన?

న: పూర్వనాటకములతో పాత్రధారులు మాత్రమే నటించు చుండిరి. ఇందు శ్రోతలు కూడ నటింప వలసి యుండును.

సూ॥ అదేమి అట్లందువు

న: ఈ ప్రదర్శనకు పండితులు తప్ప సాధారణప్రజలు రారా?

సూ: వార్షికోత్సవము కదా! అబాలగోపాలముగా అందఱును వత్తురు.

న; అట్లయినచో నాటకము సంస్కృతములో జరుగుచుండఁగా ఆ భాష తెలియని సామాజికులు ఏమి చేయవలె? ప్రక్కవారిని చూచుచువాఁడు ఇకిలించినచో ఇకిలించుచు సకిలించినచో సకిలించుచు ఏమియును అర్థము గాకపోయినను ఏమో అర్థమైనట్లు నటింపవలసి యుండును.

సూ: ఓరీ! నీ కున్న మాత్రము తెలివి మాకును కలదులే. అనువాదము కూడ రూపకమునందే సమకూర్పఁబడి యున్నది.

న: అది ఎట్లు కూర్పఁబడినది? చిత్రముగ నున్నదే (తెరలో శబ్దము) (కుడివైపు చూచి)ఆ వచ్చుచున్నవారెవరు?

సూ: (పరికించి చూచి) ముందు వచ్చుచున్న వాఁడు నరసయ్య శాస్త్రి. వాని వెనుకనే కొంచెము దూరములో వచ్చుచున్న వాఁడు గోపన్న. వారిరువురు ఎఱ్ఱన్నగారి శిష్యులు. గుడ్లూరులో నీలకంఠేశ్వరాలయమునొద్దకు పోవుచున్నారు. మనముకూడ పోదము పద.

(ఎడమవైపుగ నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన

[కుడివైపునుండి నరసయ్య, వాని వెనుక గోపన్న ప్రవేశింతురు]

గో: నరసయ్యా!

నర: (వెనుదిరిగి)నీవా! గోపన్నా!ఇంత ఆలస్యమైన దేమి?

గో; పొలము పనులు గదా. క్షణము తీరుట లేదు. ఇప్పుడే పాటిచేనినుండి పరుగు పెట్టినట్లుగా వచ్చుచున్నాను. గురువుగారు ఎక్కడ నున్నారు?

నర: వారు ప్రాయంసవనకృత్యములను దీర్చి స్వాములవారియొద్దకు వెళ్ళినారు.

గో: మరి నీవును ఇప్పుడే వచ్చుచున్నావా?

నర: లేదు నేను గురువుగారితోనే బయలు దేరితిని. వారు ఆలయము వొద్దకు

[illegible] గచ్చింది?

దానిని తీసికొని వచ్చుచున్నాను (తాళపత్రగ్రంథమును చూపును)

గో: అట్లయినచో గురువుగారు స్వాములవారితో ఈ పూరణమునుగూర్చి ప్రస్తా వింతు రన్నమాట.

వర॥ ఔను వారికి ఆ పద్యములను వినిపించి పండితుల యనుమతితో స్వాములవారి యాశీస్సులను పొంది పూరణమును పూర్తి చేయవలయు నని తలంచుచున్నారు.

గో: మంచిదే! జనము చాలమంది లోపల చేరినట్లున్నారే.

వర: ఔను. నిన్న సాయంకాలము గురువుగారు నీలకంఠేశ్వర స్తవమును స్వాము లవారి సమక్షమున పండితులకు చదివి వినిపించినారు కదా: దానిపై తర్జనభర్జనలు జరుగు నని కుతూహలముతో గ్రామములోని పెద్దలందరు చేరినారు. స్వామివారి సందర్శనముకొఱకు కూడ ప్రక్క యూళ్ళ నుండియు చాలమంది వచ్చినారు.

గోప: సరే, మఱి ప్రసంగము సంస్కృతమున కదా జరుగును. సామాన్యులకు ఏ మర్థ మగును?

నర: స్వాములవారు దానికి తగిన యేర్పాట్లు చేసియే యున్నారు. వారు అనేక ప్రాంతములలో పర్యటించుచుందురు. అన్నిచోట్ల ఈ సమస్య ఉండును. వారి శిష్యు లలో ద్విభాషి చంద్రశేఖరశాస్త్రిగారు ఉన్నారు. ఆయన వారిప్రసంగములను పండితులభాషణమును ఎప్పటికప్పుడు తెలుగులో చెప్పుచుండును.

గోప: వారు మాటాడుకొనుచుండగా మధ్యలో ఈయన ఎట్లు కల్పించుకొనును.

నర: అది స్వాములవారికి పండితులకు కూడ అలవాటే అయినది. వారు రెండు మూడు వాక్యములు అయిన తరువాత నిలిపి ఆయన వంక చూతురు. వెంటనే ఆయన ఆ వాక్యములను తెనుఁగులో చెప్పును.

: సరే. ఇంక మనము కూడ పోదము పద

ఇది విష్కంభము

[వేదికపై ఉన్నతాసనమున స్వాములవారు ఆసీనులై యుందురు. వారికి కుడివైపున పండితులు ఎఱ్ఱన, ఎడమవైపున కరణం కృష్ణయ్య మునసబు వేంకటరెడ్డి మొదలుగా గ్రామములోని పెద్దలు కూర్చుండి యుందురు. నరసయ్య గోపన్న ఎఱ్ఱనకు దాపున కూర్చుందురు.]

ఎఱ్ఱ: (చేతులు జోడించి స్వామివారితో) శ్రుతస్తావ ద్భగవత్పాదైః పండితాఖండలైః స్సార్ధం నీలకంఠేశ్వరస్తవః అన్య రీతిః భవ్యేతి వా నవా భగవత్పాదేభ్యో జ్ఞాతు మిచ్ఛామి ఉక్తం ఖలు మహాకవినా కాళిదాసేన.

చంద్ర : ఎఱ్ఱన్నగారు విన్నవించుచున్నారు. పండితులతో కూడ స్వాములవారు నీలకంఠేశ్వరీ స్తవమును విన్నారు కదా. అందలి రీతి చక్కగా నున్నదా లేదా అని తెలిసికొనగోరుచున్నాను. వారికి కాళిదాస మహాకవి చెప్పినట్లు గుణదోషములను గుర్తింపఁ గలిగినసజ్జనులే కావ్యమును వినఁదగినవారు. అగ్నియందుఁ గదా బంగారము యొక్క పరిశుద్ధతగాని మాలిన్యముగాని వ్యక్తమగును.

స్వామి : కింభో రామశాస్త్రిన్ కి ముచ్యతే భవద్భిః పండితైః

రామ : సర్వేషా మస్మాకం సర్వథా అగ్రగణ్యాః ప్రభాకర భట్టారకా ఏవగ్రంథస్య ప్రాశస్త్యం ప్రకటయన్తు

చంద్ర : ప్రభాకర భట్టారకులే గ్రంథప్రాశస్త్యమును వక్కాణింతురని రామశాస్త్రిగారనుచున్నారు.

స్వామి : బాఢమ్ ! ఉచ్యతామ్ (ప్రభాకరభట్టు వంకఁ జూచును)

ప్రభా : గ్రంథస్యశైలీ అతీవ మనోజ్ఞా ! తత్ పద్యమ్ "నిను సేవించిన" ఇత్యాది అద్యాపి శ్రవణకుహరయోః గుంజాయమానో వర్తతే తత్పునః పఠ్యతామ్

చంద్ర : ఎఱ్ఱనగారి శైలి మనోహరముగా నున్నదని ప్రభాకర భట్టారకులవారు ప్రశంసించుచు "నిను సేవించిన" అని మొదలగు పద్యమును మరల చదువుమనుచున్నారు.

ఎఱ్ఱ : తథైవ

మ॥ నిను సేవించినఁగల్గు మానవులకున్
వీటి వధూటీ ఘటీ
ఘనకోటీ శకటీ కటీ తట పటీ
గంధే భవాటీ పటీ
రనటీ హారివటీ సువర్ణమకుటీ
ప్రస్ఫోటికా పేటికల్
కనదామ్నాయ మహాతురంగ శివలిం
గా ! నీలకంఠేశ్వరా"

ప్రభా : బహుమనోహారేణ ఖలు శబ్దాలంకారేణ అస్య కవివర్యస్య శైలీ విరాజతే !

స్వామి : సుష్ఠూక్తమ్.

చంద్ర : ఎఱ్ఱనగారి శైలి శబ్దాలంకారశోభితమై బహు మనోహరముగా నున్నదని ప్రభాకరులవారు ప్రశంసించుచున్నారు. స్వామివారును సంతుష్టులైనారు. ఈ శుభసమయమున ఎఱ్ఱనగారు ఒక విన్నపమును చేయఁగోరుచున్నారు.

వెంకటరెడ్డి: ఏమో అనుకున్నాము గాని ఎఱ్ఱయ్యగారు సామాన్యులు కాదయ్యా!

కృష్ణయ్య : నిజమే ! ఎవరి శక్తి యైనను నిగ్గు తేలునది పరీక్షలో నెగ్గినప్పుడే కదా !

స్వామి: (ఎఱ్ఱనతో) ఉచ్యతామ్.

ఎఱ్ఱ : ఆంధ్రభాషాయాం శ్రీ మహాభారత గ్రంథస్య అవతరణ ముద్దిశ్య కించి ద్వక్తుమిచ్ఛామి.

ప్రభా : అతి పవిత్రస్య పంచమ వేదస్య శ్రీ మహాభారతస్య పామర వ్యవహారావతరణ ముద్దిశ్య భగవత్పాదసన్నిధౌ కిమితి ప్రస్తూయతే.

స్వామి : అలమనయా శంకయా ! భగవతో బాదరాయణస్య గ్రంథః యది సమ్యక్ దేశభాషాసు అనూద్యతే తదా సామాన్య జనస్య సులభగ్రాహ్యో హి భవతి వైదికో ధర్మః ! తదుద్యమం ప్రతి అస్మాక మపి కుతూహలో వర్తతే ! తదుచ్యతాం నిశ్శంకమ్ !

చంద్ర: ఎఱ్ఱనగారు మహాభారతాంధ్రీకరణమును గూర్చి ప్రస్తావింపఁదలంచుచున్నారు. పంచమ వేదమైన మహాభారతమును పామర వ్యవహారమునకు దింపుటను గూర్చి భగవత్పాదుల సన్నిధియందు ప్రస్తావించుటేమి యని ప్రభాకరుల వారు ఆక్షేపించుచున్నారు. కాని స్వాములవారు ఆగ్రంథము చక్కఁగా దేశ భాషలలోనికి అనువదింప బడినచో సామాన్య జనులకు వైదికధర్మము అవగతమగునని ఆ ప్రయత్నమును గూర్చి తమకును కుతూహలము కలదని ఎఱ్ఱనగారిని నిస్సంకోచముగా చెప్పుమనుచున్నారు.

ఎఱ్ఱ : మహాన్ప్రసాదః ! భగవత్పాదానాం విదితచరమేవ వాగనుశాసనఇతినుగృహీతనామధేయః కవివరేణ్యః శ్రీ నన్నయభట్టారకః వేంగీ రాజ్యపరిపాలకేన వైదికధర్మానురక్త చిత్తేన రాజ రాజ నరేంద్రేణ ప్రార్థిత స్సన్ భగవతో బాదరాయణస్య ధర్మతత్త్వ ప్రబోధైక తాత్పర్యం హృది నిధాయ ప్రసన్న మధురయా గంభీరయాచవాచా శ్రీ మహాభారతే ఆదిపర్వ సభాపర్వ తృతీయే చారణ్యపర్వణి అర్థాధికంచ అనూద్య స్వర్గతోఽభవత్ !

తాత్పర్యమును లక్ష్యముగా పెట్టుకొని మహాభారతమునందు ఆది సభా పర్వములను అరణ్యపర్వమున సగమునకు పైఁగా చక్కని శైలిలో ఆంధ్రీకరించి దివంగతులైనారు.

ఎఱ్ఱ : తదను బహువర్షానంతరం కృతక్రతునా అమాత్యవర్యేణ శ్రీ తిక్కనార్యేణ విరాటపర్వప్రభృతి స్వర్గారోహణ పర్యంతో గ్రంథః రసోజ్జ్వలయా రీత్యార చిత స్సముల్లసతే ! కేనాపి వా కారణేనతేన మహాకవినా అరణ్యపర్వ శేషః హరివంశశ్చనాంధ్రీకృతౌ !

చంద్ర : తరువాత చాలాకాలమునకు అమాత్యవర్యులైన శ్రీ తిక్కనసోమయాజుల వారు రసోజ్జ్వలమైన రీతిలో విరాటపర్వమునుండి స్వర్గారోహణపర్వము వఱకును రచించినారు. ఎందువల్లనో వారు అరణ్యపర్వ శేషమును హరివంశమును రచింపలేదు.

స్వామి : (ఎఱ్ఱనను చూచుచు నవ్వుచు)తౌ మహాన్తౌ కావ్యఖండౌ సంధాతుమ్ అభిలషసి కిమ్?

చంద్ర : ఆ మహాకావ్య ఖండములను సంధానింపఁగోరుచున్నావా యేమి అని స్వాములవారు అడుగుచున్నారు.

ఎఱ్ఱ : (అంజలించి) భగవత్పాదానాం ప్రసాదేన పండితాఖండలానాం ఏతేషాం ఆశీర్వాదబలేన చ తస్మిన్ కృతకృత్యో భవితుమిచ్ఛామి. అను గృహ్ణన్తు భగవత్పాదాః మహాన్తః కవి పండితవరేణ్యాశ్చ

చంద్ర : స్వామివారి యనుగ్రహమున పండితవర్యుల యాశీర్వాద బలమున ఆ గ్రంథ సంధానమునందు కృతకృత్యుఁడను కాఁగలనని అనుగ్రహింపుడని ఎఱ్ఱనగారు వారిని ప్రార్థించుచున్నారు.

వెం॥రెడ్డి: ఇదేమిటి ? ఈయన మొదటిపాటకే వచ్చినాఁడే. అరణ్యపర్వము జోలికి పోవద్దని మన మందఱము ఎన్నోసార్లు చెప్పినాము గదా ! ఈయనకీ మంకు పట్టేమిటి ?

కృష్ణయ్య: మన మాటలు ఆయన చెవికెక్కునా ? ఉంగరాలచేతితో మొట్టినచో విన్నట్లు ఉత్త మాటలతో వినదురా ! స్వామివారే ఈ తిక్క కుదుర్చగలరు.

సామి : (క్షణము మౌనము వహించి ప్రభాకరభట్టువంకఁజూచి) ఆలోచ్యతాం

ప్రభా : అస్తునామ ! అయం శేషభాగః విపశ్చిద పశ్చిమాభ్యాం మహాకవిపరేణ్యాభ్యాం వినిర్మితయోః అపూర్వకావ్యకళావిశిష్టయోః మహాఖండయోః మధ్యే వర్తతే ! యది పూరణగ్రంథః కేనాపి కారణేన తాభ్యాం సర్వథాసామ్యం న భజేత తదా పఠితౄణామ్ శ్రోతౄణాంచ సహృదయానాం హృదయే వైరస్య మేవ జాయేత! స్తుతిరూపైతల్లఘు కావ్యకరణమాత్రేణ తన్మహా కావ్యఖండ సంధానకరణే అయంవాఅన్యః కవీశ్వరోవా సమర్థో భవతి ఇతి నిశ్చేతుం న పారయామః !

చంద్ర : ప్రభాకరులవారు అనుచున్నారు. రామశాస్త్రిగారు అన్నట్లు నీలకంఠేశ్వర స్తవము చక్కగానే యున్నది. కాని ఈ శేషభాగము మహాకవివరేణ్యులైన నన్నయ తిక్కనార్యుల మహాకావ్య ఖండముల మధ్య నున్నది. పూరణ గ్రంథము ఏ కారణముచేతనైనను ఆ కావ్యఖండములతో సకల విధముల సమానముగా ఉండకున్నచో సహృదయులకు వైమనస్యమునే కలిగించును లఘుకావ్య రచనము చక్కగా నున్నంత మాత్రమున వీరే కాదు మఱి యే కవీశ్వరుడైను అట్టి మహాకావ్యఖండములను సౌష్ఠవముతో సంధింపగలడ డని ఎట్లు చెప్పగలము ?

కృష్ణయ్య: చూడవయ్యా ! చూడు. పండితులు ఎట్లు డీకొనుచున్నారో.

వెంకటరెడ్డి : ఔను మఱి మనమంత గట్టిగా చెప్పగలమా?

ఎఱ్ఱన : భవతు ! అత్ర కించిద్వక్తు మిచ్ఛామి.

స్వామి : ఉచ్యతామ్.

ఎఱ్ఱన : యది భగవత్పాదైః అనుజ్ఞాయతే, అస్మిన్ శేషభాగే సరస్వతీ గీతా ఖ్య సందర్భమ్ మయా ఆంధ్రీకృతమ్ అద్యైవ శ్రావయామి.

స్వామి: అయం ప్రథమః కల్పః

రామశాస్త్రి: ఉచితం ఖలు రచనారంభే భగవత్యాః సరస్వత్యాః స్తుతిఃకృతా

ప్రభా : బాఢమ్ ! అవహితాః స్మః

(నరసయ్య తాళపత్రగ్రంథమును ఎఱ్ఱన కందించును)

చంద్ర: శేషభాగమున తాము రచించిన సరస్వతీగీత యను సందర్భమును విని శేషపూరణమున తమకు యోగ్యత యున్నదో లేదో నిర్ణయింపుడని ఎఱ్ఱనగారు కోరుచున్నారు. స్వామివారు పండితులును అనుమతించినారు

అను పెక్కింటిని సంపాదింపఁగల నను నాత్మవిశ్వాసము అప్పుడు పుష్కలముగ నుండెను. కాని ఇప్పటి పరిస్థితి వేఱు. ఎప్పుడులేని నిర్వేద మిప్పుడు ఆయనను పూర్తిగా ఆక్రమించినది. ఇది రెండు విధములు. ఏవి మనకు సుఖసాధనములగునని ఎంతో తాపత్రయపడి సంపాదించుచున్నామో అవి వ్యర్థములని తోఁచుట మొదటిది. సుఖసాధనమునకు ప్రతిబంధకమై విజృంభించుచున్న దానిని జయింపఁ జాలకుంటిని గదా అను దైన్యము రెండవది. దానము చేసిన మఱుక్షణములో ఆయనకు ఈ లోక సామ్రాజ్యము కలవలె చెదరిపోయెను. తపస్సుచే ఆర్జించిన లోకములు చూచుచుండఁ గనే దగ్ధము లయ్యెను. ఇట్టి లోకములను మరల సంపాదించినను ఎప్పటికైనను అవి నశింపక తప్పదు. దీనివలన శాశ్వతమైన సుఖములేదు అను విషయము ఆయనకు అనుభవసిద్ధమయ్యెను. "కర్మచేత సంపాదింపఁబడు లోకములు అశాశ్వతములు. అశాశ్వతములైన వానివలన శాశ్వతమైన సుఖము కలుగదు. ఇట్లు పరీక్షించి తెలిసికొని బ్రాహ్మణుఁడు నిర్వేదమును పొందును. కర్మచేత మోక్షము కలుగదు" అని శ్రుతి చెప్పి నట్లుగా భార్గవుఁడు ఏలోకముల యైశ్వర్యమును ఎంతగా సంపాదించినను దానివలన శాశ్వతమైన సుఖము లేదని దృఢముగా గ్రహించెను.

అంతేకాదు పరాక్రమముచే ఈలోకమును, తపస్సుచే దేవలోకములను జయింపఁ గలిగిన తాను తనయందే విజృంభించుచున్న కోపమును జయింపలేకపోయితి నని ఆయన మొదటిసారి గ్రహించెను. దానికి లోఁబడుట వలననే ఎంతో అనర్థము సంభవించినదని ఆయన గడచిన జీవితమునంతను విమర్శించుకొని గ్రహించి పరితపింప జొచ్చెను. కార్తవీర్యుని సంహరించినప్పుడే బ్రాహ్మణునకు కోపము తగదని, క్షమయే ప్రశస్తమని తండ్రి తనకు బోధించియుండెను. కాని ఆయనయే హతుఁడై నప్పుడు ఆయన కావించిన బోధ క్రోధవేగమున కొట్టుకొనిపోయెను. పాపము సంభవించినచో యజ్ఞములచే పోఁగొట్టుకొనవచ్చును. ఎట్లయినను ఈ క్షత్రియులను నిర్మూలింపవలసినదే" అను తలంపుతో అప్పుడు ఆయన క్రోధమునకు తనపై నిరంకుశమైన యధికారము నొసంగెను. అందువలన బ్రాహ్మణునకు అయోగ్యమైన ప్రాణిహింసను ఎంతో ఆయన కావించెను. యజ్ఞములు ఆపాపమును పోఁగొట్టగలిగినను క్రోధమును కదిలింపలేక పోయినవి. ఆక్రోధము వలననే, దేవతలు మానవులు ఎంచ టో చూచుచుండఁగా, శ్రీరాముని వలన ఆయనకు పరాజయము సంభవించినది. అప్పు డాయనకు తనకు నిజమైన శత్రువు తన కోపమే అని, దానిని జయించుట సులభము కాదని స్పష్టముగా గోచరించెను.

—*—*—*—

వేంకట : అబ్బ ! ప్రభాకరులవారు సామాన్యులు కారయ్యా !కాలికి తీసినచో మెడకు మెడకు తీసినచోకాలికి తగిలించుచున్నారేకానిఒక పట్టున వదలుట లేదే!

కృష్ణయ్య : పండితు లనఁగా ఏమనుకొన్నావు మఱి ! మనముందు ప్రగల్భములు పలికె నట్లా ? ఇప్పుడుగదా ఎఱ్ఱయ్యగారి పస ఏమిటో తేలవలె.

ఎఱ్ఱన:- నహుష ప్రశ్న సందర్భానంతరం ప్రసక్తం వర్షాగమం శ్రీ నన్నయభట్టా రకాః ఏవం వర్ణయన్తి.

చంద్ర:- నహుషప్రశ్నల ఘట్టమునకు తరువాత వర్షాగమమును నన్నయభట్టారకుల వారు ఇట్లు వర్ణించు చున్నారు.

ఎఱ్ఱన:- చం॥ అరుదగు తత్పయోద సమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ బల్వలభూముల భూరి దర్దురో
త్కర రవముల్ మహీరుహ శిఖండములందు శిఖండి తాండవాం
తరమద మంజులస్వన ముదారత రమ్యములై వనంబునన్ ॥

చం॥ దళిత నవీన కందళకదంబ కదంబక కేతకీరజో
మిళిత సుగంధ బంధుర సమీరణుఁడన్ సఖుఁడూఁచు చుండఁగా
నులియుచు మొల్లగుత్తులను మువ్వెల లొప్పఁగ నెక్కియూఁగె ను
ల్లలదళి నీకులంబు మృదులధ్వని గీతము విస్తరించుచున్ ॥ 138

కం॥ సురచాప చిత్రగగన
స్ఫురణం బురణించునట్లు భూవనిత చిరం
తర చిత్రితయై యొప్పెను
సురుచిర నవతృణ శిలీంధ్ర సుర గోపములన్ ॥ 139

వ॥ తత్సమయా నంతరంబున 140

ఉ॥ భూసతికిందివంబునకుఁ బొల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకల ప్రమోదకరమై విలసిల్లె మహర్షి మండలో
పాసిత రాజహంస గతి భాసిప్రసన్న సరస్వతీక మ
బ్జాసన శోభితం బగుచు నబ్జజుయానముతో సమానమై ॥ 141

కం॥ గగనాగ్ర కుసుమ లసిత గ తారకహార పంక్తు లం

చం॥ స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరివోయి నిరస్త నీరదా
వరణములై దళోత్కమల వైభవ జృంభణముల్లసిల్లను
ద్ధురతర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసర ముఖంబులు శారదవేళఁ జూడఁగన్ ॥ 143

శా॥ దానాంభః పటలంబునం బృథు పయోధారావళిం దాల్చి గ
ర్జా నిర్ఘోషము బృంహితధ్వులనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గెనాఁ
గా నొప్పారె మదోత్కట ద్విరద సంఘంబుల్ వనాంతంబునన్॥144

కం॥ కల నీలకంఠ కోలా
హల లీలలు సెంచె రాజహంస కులము లం
దులకించె సప్త పర్ణా
వళి వికశిత కుసుమ కుటజ వాటికల గెడన్ ॥ 145

మ॥ అతి గాంభీర్య విభూతినేకములు కాహంకార నిశ్శేష శో
షిత పాథోధి పయస్కుఁడైన మునివోఁ చెం బుణ్యతేజోమయా
కృతి నయ్యాప్య దిగంత వీథిఁ బ్రకట క్రీడాకళా గర్వ గ
ర్జిత మండూక కళంకితాంబు శుచితా సిద్ధి ప్రదాహార్యుఁడై॥ 146

తే॥ వికద శారదాంబుద పరివేష్టనమునఁ
బొలుచు గగనంబు ప్రతిబింబమో యనంగ
వికచ కాశవనీ పరివేష్టనమున
నతిశయిల్లె నిర్మల కమలాకరములు 147

వ॥ అట్టి శారదాగమంబున నుత్ఫుల్ల కమల కల్హార కేసరకరాళ కలితకల్లోల మాలిని యు ననేక మునిలోక సతత సంసేవ్య మానవిపుల పులి నోత్సంగయు విరంతరతీర వానీర వనమండలీ విలసితయు నాకాశసంకాశ విశద సలిలయునైన మహాసరస్వతీనది నమదినస్నానపానాది విశేషంబులం బరితోషంబు నొందుచుఁ బాండునందనులమ్మరుద భూమిం గొన్నిదినంబులు వసియించి తదనంతరంబ ధౌమ్యాది భూసురవరులు నింద్ర సేనాదిమూలభృత్యులుఁ దోడ నరుగుదేరఁ గామ్యకవనంబునకు వచ్చియచ్చటిమును ల

స్వామి: (చిఱునవ్వుతో) ఇదానీం కిముచ్యతే భవద్భిః ? అస్మిన్ సందర్భే అస్య కవేః ఆరంభః కుతః ?

ప్రభా: క్షామ్యన్తు భగవత్పాదాః ! నన్నపార్యస్య గ్రంథః కుత్రావసితః కుతో వా అస్య కవివరేణ్యస్య ఆరంభః ఇతి నజ్ఞాయతే.

రామ: రీతిభేద లేశోఽపి నస్ఫురతి కిల। సర్వోఽపి సందర్భః ఏకకర్తృక ఏవేతి ప్రతిభాతి।

ప్రభా: నన్న పార్యస్య సర్వోఽపి సారస్వతాంశః ఏవ మెఱ్ఱనార్యం సంచక్రామేతి విభావయామి.

రామ: నన్నయభట్టారకా ఏవ స్వీయకావ్య పూరణాయ పునః ఏవం ఎఱ్ఱనార్య రూపేణ భువం అలంచక్రురితి మే ప్రతిభాతి.

స్వామి: సాధు! సాధు! సమ్యగుక్తం భవద్భ్యామ్.

ఎఱ్ఱన: ధన్యోఽస్మి.

చంద్ర: నన్నయగారి గ్రంథము ఎక్కడ ముగిసినదో ఎక్కడనుండి ఎఱ్ఱనగారు ఆరంభించిరో చెప్పుఁడని స్వాములవారు పండితులను ప్రశ్నించుచున్నారు. ఎక్కడను రీతిభేదము కన్పించుట లేదని సందర్భమంతయు ఏక కర్తృకమువలెనే తోచుచున్నదనియు నన్నయభట్టారకులవారి సారస్వతాంశ సర్వము ఎఱ్ఱనగారికి సంక్రమించినదని ప్రభాకరులవారు ప్రశంసించుచున్నారు. నన్నయగారే మరల ఇట్లు ఎఱ్ఱనగారుగా అవతరించిరని రామశాస్త్రిగారు పొగడుచున్నారు.

వేంకట: మొత్తముమీఁద మన యెఱ్ఱయ్యయే నెగ్గినాఁడు నాకు తెలియక అడుగుదును. మఱియింక ఈ యరణ్యపర్వము కొనసాగించినచో చెఱుపులేదా ?

కృష్ణ: స్వాములవారే ఆశీర్వదించుచుండఁగా ఇంక చెఱుపేమున్నదయ్యా ! వారు తమ తపశ్శక్తిచేత ఏదోషములైనను తొలఁగింపఁగలరు. దానికొఱకే గదా ఎఱ్ఱనగారు వారి యాశీస్సులను పొందుటకు ఇంతగా తాపత్రయపడుచున్నారు.

స్వామి: వత్స ! ఇతః పరం నిస్సంకోచం శేషగ్రంథ పూరణం కురు. పూరణానన్తరం పుస్తకమేకం అస్మత్సకాశం శ్రీశైలం ప్రేషయ. వయం తత్ర శ్రీ భ్రమరాంబా మల్లికార్జున సన్నిధౌ కంచిత్కాలం వత్స్యామః। త్వం తావదేతం శేషగ్రంథం

ఎఱ్ఱన: (అంజలితో గ్రహించి) ధన్యోఽస్మి కృత కృత్యోఽస్మి.

చంద్ర: స్వాములవారు సంతోషముతో ఎఱ్ఱనగారితో చెప్పుచున్నారు. ఇంక నీవు నిస్సంకోచముగా శేష గ్రంథమును పూర్తిచేయుము. తరువాత ఒక ప్రతిని మాకు శ్రీశైలమునకు పంపుము. మేము శ్రీ భ్రమరాంబికా సమేత మల్లికార్జున స్వామివారి సన్నిధియందు కొంతకాలముందుము. నీవీ గ్రంథమును ఇచ్చటనే శ్రీ నీలకంఠేశ్వర స్వామివారి సన్నిధియందు ప్రవచనము గావింపుము. పరమేశ్వర ప్రసాదమున సకలాభ్యుదయములను పొందఁగలవు.

స్వామి: (గ్రామాధికారులవంకఁ జూచుచు) మహో జనాః శ్రుణ్వన్తు । అయం కవిరాజః భవద్భిః రాజేంద్ర వత్పూజ్యః । అస్య యద్యత్ అభిలషితం తత్సర్వం సప్రశ్రయం సంపాద్యతామ్ । ఋషికల్పస్య అస్య మహాకవేః సపర్యన సేవ భవతాం చరితార్థతా.

వేంకట,కృష్ణయ్య:(నమస్కరించుచు) చిత్తము చిత్తము తమరాజ్ఞాపించినట్లేచేయుదుము.

కృష్ణ: ఎఱ్ఱయ్యా ! మొత్తముమీఁద మనయూరిపేరు నిలఁబెట్టినావయ్యా!

ఎఱ్ఱన: అంతయు పెద్దలయాశీర్వచనమే.

స్వామి: అయం కవివరేణ్యః సారస్వత ప్రపంచే జేగీయ మానో భూయాదితి భవన్తో మహాన్తో అనుగృహ్ణన్తు.

పండితులు: తథాస్తు.

రామశాస్త్రి: శ్లో ॥ జయతు జయతు దేవో నీలకంఠో మహేశః
జయతు గురువరేణ్యా శ్శంకర స్వామి వర్యాః ।
జయతు సుకవి సమ్రా డెఱ్ఱనార్యో మహర్షిః
జయతు సతత మాంధ్ర్యాం పంచమామ్నాయ కావ్యమ్ ॥

స్వామి: సకల సన్మంగళాని భవంతు.

పండితులు: తథాస్తు.

( తెర వ్రాలును )

## గోబ్రాహ్మణాధిక్యత యేల ?

"గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యమ్"

"గోవులకు బ్రాహ్మణులకు నిత్యము శుభ మగును గాక !" అని పురాణ ప్రవచనాదుల ముగింపునందు చెప్పుట అనాదిగా ఆచారముగ నున్నది. ఆంగ్ల విద్యా ప్రభావము బలిసిన తరువాత ఇటీవల ఈ సూక్తిని అనేకులు శంకింపజొచ్చిరి. 'మను ష్యులలో ఎన్నో జాతులుండఁగా బ్రాహ్మణులకు మాత్రమే ఎల్లప్పుడు శుభము కలుగ వలయునని ఎల్లరును ఏల ప్రార్థింప వలె? ఈ బ్రాహ్మణ పక్షపాతము యుక్తము కా దు. కాఁబట్టి "గోమానవేభ్య శ్శుభమస్తు నిత్యమ్" అని మార్చుట మేలు" అని కొం దఱు భావించిరి. "అట్లయినచో పశువులలో కూడ ఎన్నో జాతులుండఁగా గోవులకు మాత్రమే శుభము కలుగ వలయునని ప్రార్థించు టెందులకు ? కావున, 'పశుమానవేభ్య శ్శుభ మస్తు నిత్యమ్' అని మార్చిన ఇంకను మే" అని మఱి కొందఱు తలంప వచ్చును.

మఱి యింతకాలముగా ఈ సూక్తిని ప్రవర్తింప జేయుచున్నవా రందఱు కారపోయినను కొందఱైనను బుద్ధి మంతులై యుండరా ? వారి కీశంకలు లిగి యుం డవా ? వారందఱు ప్రాయికముగా ప్రాచీనకాలమున బ్రాహ్మణులే యగుటచే, జాతి పక్షపాతమున వారు ఆసూక్తిని ప్రచార మొనర్చియుందు రని యీకాలమున కొందఱు తలంచుట సహజము. కాని ఈసూక్తిని నిరంతరము వినుచున్న బ్రాహ్మణేతరులైన పరిపాలకులు ఏల ఆక్షేపింప లేదు ? మనకున్న యింతమాత్రపు తెలివి వారికి లే దనుట వారిని అవమానించుటే యగును. కావున వా రందఱు ఈ సూక్తియందు ఏదో సామం జస్యమును గుర్తించి రనుట స్పష్టము. దానిని మనము శ్రద్ధతో ఆలోచించి గ్రహించు టయే శ్రేయస్కరము.

మనువు వేదధర్మములను సంగ్రహించి స్మృతిని రచించునప్పుడు, ఆధర్మ ములు భారతీయులకే గాక సకల మానవులకు శ్రేయస్సును కలిగించునని ఆరంభమున నే యిట్లు స్పష్ట మొనరించెను. "ఈ దేశమునందు పుట్టిన యగ్రజన్ముని యొద్ద, పృథి వి లోని సర్వ మానవులును తమ తమ నడవడికలను గూర్చి శిక్షణమును పొంద వలయును".

శ్లో ॥ ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః ।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః ॥

[illegible]

వేదధర్మములు, మానవులకు రెండువిధముల ఉపయోగపడుచున్నవి. వేద ధర్మముల ననుసరించి యజ్ఞ యాగాదులు అనుష్ఠింపబడినచో వానివలన సువృష్టి మంచిపంట లభించి మానవులకు సుఖ శాంతులు కలుగును. యజ్ఞములు జరుగ కున్న చో వర్షములు పడవా ? ఎందుకు పడవు ? మనకు హితకరముగా అవి సంభవింపవు. అతివృష్టియో అనావృష్టియో సంభవించును. అంతే కాదు, కేవలము ప్రకృతిజన్యమైన వర్షము వలన లభించు నీటికి, దానివలన కలుగు పంటకు యజ్ఞానుష్ఠానము వలన కలుగు వర్షపు నీటికి, దాని వలన కలుగు పంటకుఉండునట్టి గుణము ఉండదు. శ్రీకృష్ణుడు అర్జునునితో ఇట్లు చెప్పెను—

"సృష్టియొక్క ఆరంభమునందు బ్రహ్మ దేవుఁడు యజ్ఞములతో కూడా ప్రజలను సృష్టించి, 'ఈ యజ్ఞములు సాధనముగా మీరు వృద్ధి పొందుఁడు, ఇవి మీకు ధేనువు పాలనువలె, అభీష్టముల నన్నింటిని ఈయఁగలదు', అని చెప్పెను."

శ్లో ॥ సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్ ॥
భగవద్గీత-అధ్యాయ. 3-శ్లో. 10

కావున యజ్ఞము సకలాభ్యుదయములకు సాధనమనుట స్పష్టము. యజ్ఞ నిర్వాహణము నకు బ్రాహ్మణుఁడు, గోవు అను రెండే ప్రధాన సాధనములు. ఇతర సాధనములు లోపించినప్పుడు వానికి బదులు ఇతర పదార్థములను ఉపయోగింప వచ్చును. కాని బ్రాహ్మణునకు గోవునకు బదులుగా వాఁడ దగినది మఱియొకటి లేదు. మంత్రమును చెప్పుటకు బ్రాహ్మణులు, హవిర్ద్రవ్యములైన పాలు, పెరుగు, నెయ్యి మొదలగువాని నొసంగుటకు గోవు లేకున్నచో యజ్ఞము జరుగనే జరుగదు. బ్రాహ్మణేతరుని మంత్రము, ఇతర పశువు పాడి యజ్ఞమునకు ఉపయోగింపవు. ఉపయోగించినచో ఏమగును? "ఈ పదార్థములతో ఈరీతిగ ఈయౌషధమును తయారు చేయవలయు" నని వైద్యుడు నిర్ణయించినప్పుడో, లేక, "ఈపదార్థములతో ఈరీతిగ అణ్వస్త్రమును (Atom Bomb) తయారు చేయవలయు" నని శాస్త్రజ్ఞుఁడు చెప్పినప్పుడో ఏకారణము చేతనైనను పదార్థములలో గాని పద్ధతిలో గాని మనము మార్పు చేసి ఆయౌషధమునో, అణ్వస్త్రమునో తయారుచేసిన నేమగును ? అభిలషించిన ఫలితము రాకపోఁగా విపరీత ఫలితములు కూడ సంభవించును, యజ్ఞ ప్రక్రియ కూడ అట్టిదే. దానివలన మనము అభిలషించిన ఫలము రావలయు నన్నచో శాస్త్రము చెప్పినట్లు చేయవలసినదే. కావున గోవులు, బ్రాహ్మణులు యజ్ఞమునకు అపరిహార్యములైన (Un-avoidable) సాధనములు. అట్లే యజ్ఞములు సువృష్టికి సస్యసాఫల్యమునకు సాధనములు. కావున గోవులు, బ్రాహ్మణులు శుభ

స్థితియందున్నచో యజ్ఞములు చక్కఁగా నిర్వహింపబడి సకలమానవులకు అభ్యుదయము కలుగును. గో బ్రాహ్మణుల శుభస్థితియందు ఇతర పశుపక్షి మానవాదుల అభ్యుదయము ఇమిడి యున్నది. అందువలన గో బ్రాహ్మణులకు శుభము కలుగవలయు నని ప్రాచీనులు ప్రార్థించిరి.

ఇతర దేశములలో మన యజ్ఞములు జరుగుటకు వీలు లేదు. ఈ దేశము లో కూడ అందఱకును యజ్ఞము చేయు నధికారము లేదు. మఱి సకల దేశములలోని సర్వమానవులకు గో బ్రాహ్మణుల వలన నుపయోగ మే మున్నది ? ఈయుపయోగము నుద్దేశించియే, ప్రపంచములోని సకల మానవులు ఈదేశమునందు పుట్టిన బ్రాహ్మణుని యొద్ద తమ తమ నడవడికలను గూర్చి శిక్షణమును పొందవలయు నని మనువు చెప్పె ను. వేదాధికారములేని శూద్రులకు సంధ్యావందన పంచమహాయజ్ఞములు నమస్కార శ్లోక మంత్రములతో ఎట్లు విధింపఁబడియున్నవో అట్లే ఇతర దేశీయులకు వారి యవస్థ లను పరిసరములను అనుసరించి సంధ్యావందన యజ్ఞాదులకు పర్యాయముగా దేవతా ప్రార్థన విధానములను బ్రాహ్మణులు ఉపదేశింపవలసి యున్నది. ఆ ధర్మములు వారికి అభ్యుదయ సాధనములగును. బ్రాహ్మణుడు గోవుల పాడితో యజ్ఞానుష్ఠానము గావిం చుచు తేజస్వియై శుభస్థితి యందున్నప్పుడే సకలాభ్యుదయ సాధనమైన ధర్మమును నిర్భయముగా ప్రభువులు మొదలుగా సకల ప్రజలకు ఉపదేశింపఁగలడు. అప్పుడే ప్ర భువులు ధర్మపరులై ప్రజలను ధర్మమార్గమున నడుపఁగలరు. కావుననే ధర్మ సంస్థాప నము కొఱకు భగవంతుఁ డవతరించినప్పుడు ఆయన ప్రధానముగా వేదమును బ్రాహ్మణ త్వమును రక్షించుటకే యవతరించు నని శ్రీశంకర భగవత్పాదులవారు భగవద్గీతా భా ష్యారంభమున నిట్లు ఉద్ఘాటించినారు. "అధర్మము చేత ధర్మము తిరస్కరింపఁ బడు చుండఁగా. అధర్మము ప్రవర్ధమాన మగుచుండఁగా, జగత్తు యొక్క స్థితిని పరి పాలింపఁ గోరుచున్న యా యాదికర్త నారాయణాఖ్యుడైన విష్ణువు భూలోక బ్రహ్మ ము యొక్క (వేదముయొక్క) బ్రాహ్మణత్వముయొక్కయు అభిరక్షణము కొఱకు దేవకి యందు వసుదేవుని వలన అంశముగా సంభవించెను గదా ! బ్రాహ్మణత్వము యొక్క రక్షణమువలన వైదిక ధర్మము రక్షింపఁబడును. వర్ణాశ్రమ ధర్మ భేదములు బ్రాహ్మణత్వాధీనములై యుండుట యే ఇందులకు హేతువు."

"అధర్మేణ అభిభూయమానే ధర్మే, ప్రవర్ధమానే చ అధర్మే, జగతః స్థితిం పరి పిపాలయిషుః సః ఆదికర్తా నారాయణాఖ్యో విష్ణుః భౌమస్య బ్రహ్మణో బ్రాహ్మణ త్వస్య చ అభిరక్షణార్థం దేవక్యాం వసుదేవాత్ అంశేన కిల సంబభూవ; బ్రాహ్మణత్వస్య హి రక్షణే రక్షితస్స్యాత్ వైదికో ధర్మః ; తదధీనత్వాత్ వర్ణాశ్రమధర్మభేదానామ్ ।"

ఇట్లే చతుర్థాధ్యాయము యొక్క ఆరంభమున కూడ భగవంతుడు, "నేను సృష్టి యారంభమున వివస్వంతునకు జ్ఞాన యోగమును ఉపదేశించితి" నని చెప్పు సందర్భమున శ్రీభగవత్పాదుల వారు ఇట్లు వక్కాణించిరి." అధ్యాయద్వయము చేత చెప్పబడిన యవ్యయమైన యీ యోగమును సృష్టియాదియందు వివస్వంతుడైన యాదిత్యునకు, జగత్పరిపాలకులైన క్షత్రియులకు బలమును కలిగించుటకై, చెప్పితిని. ఆ యోగ బలముచేతనే వారు సమాహిత చిత్తులై బ్రహ్మమును క్షత్త్రమును పరిరక్షించుటకు సమర్థులగుదురు. అవి పాలింపబడినప్పుడు జగత్పరిపాలనము శక్యమగును."

"ఇమ మధ్యాయద్వయేనోక్తం యోగం వివస్వతే ఆదిత్యాయ సర్గాదౌ ప్రోక్తవానహ మవ్యయం జగత్పరిపాలయిత్రూణాం క్షత్రియాణాం బలాధానాయ తేన హి యోగబలేన యుక్తాః సమర్థా భవన్తి బ్రహ్మక్షత్రే పరిరక్షితుమ్। బ్రహ్మక్షత్రే పరిపాలితే జగత్పరిపాలయితుమ్ అలమ్।

కావున ప్రభువులు, తమయభ్యుదయము కొఱకు ప్రజలయొక్క శ్రేయస్సు కొఱకు బ్రాహ్మణత్వమును రక్షింపవలయు ననుట స్పష్టము. ఈయభిప్రాయమునే భోజ మహారాజు చంపూ రామాయణ కావ్యారంభమున నిట్లు వ్యక్తీకరించెను—

"లోకమునందు ఉచ్చస్థితి ధర్మము వలననే సంభవించు నేని, ఆ ధర్మము యొక్క యథార్థ జ్ఞానము కృతకేతరములైన (అపౌరుషేయములైన) వచనముల చేతనే (వేదముల చేతనే) కలుగునేని, ఆ వేదములు మహీసురుల చేతనే ప్రకాశము నొందు నేని, ఆమహీసురులకు కాక నాప్రణామము ఎవ్వరికి చెందును ?"

శ్లో॥ ఉచ్చైర్గతి ర్జగతి సిధ్యతి ధర్మతశ్చేత్; తస్య ప్రమా చ వచనైః కృతకేతరైశ్చేత్।
తేషాం ప్రకాశనదశా చ మహీసురైశ్చేత్; తానంతరేణ నిపతేత్ క్వను మత్ప్రణామః॥

ఎవరికైనను అభ్యుదయము ధర్మము వలననే సిద్ధించును. ఆ ధర్మము వేదము వలననే వ్యక్తమగును. ఆ వేదములు బ్రాహ్మణుల వలననే ప్రకాశమును పొందును. అందువలన ప్రజాశ్రేయస్సును కోరుప్రభుత్వము బ్రాహ్మణత్వమునే రక్షింపవలసి యున్నది. ఈదృష్టితోనే గోవులను బ్రాహ్మణులను రక్షించు కొఱకే రాజపుత్రులు, రెడ్డిరాజులు, కాకతీయ చక్రవర్తులు తమ శక్తిసంపదలను వినియోగించిరి. వేదయజ్ఞాది పరిరక్షణము కొఱకు బ్రాహ్మణులకు అగ్రహారములను మాన్యములను ఇచ్చినవి బ్రాహ్మణేతరులైన ప్రభువులేయని, బ్రాహ్మణులు బ్రాహ్మణుల కొఱకు యగ్రహారములు ఈయలేదని ఈసందర్భమున గుర్తింపవలసియున్నది. కావున "గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యమ్" అనుసూక్తి కేవలము పురాణాది ప్రవచనములలోని మంగళాశాసనము మాత్రమే కాదు, అది ప్రభుత్వములకు లక్ష్య నిర్దేశము గా నుండెను.

లి పెట్టు" అనే శీర్షికతో శ్రీ చంద్ర మధుసూదన నాయుడు, శ్రీ రాటకొండ రమేష్‌చౌ
దరి, శ్రీ సి. హెచ్. చంద్రశేఖర్ రావు, శ్రీ సి. ఆర్. సి. యం. నాయుడు, 23-9-87
బుధవారం ఆంధ్రజ్యోతి [తిరుపతి] పత్రికలో వ్రాసిన లేఖలో జయేంద్రుల చర్యలను
తీవ్రంగా నిరసించారు. కాబట్టి పూరీ శంకరుల ఆక్షేపం జయేంద్రులకు ప్రశంసాపత్ర
మైందనడం అర్థం లేని మాట.

జయేంద్రులు దండకమండలువులను వదలిపెట్టి పోయిన తర్వాత మరల వా
టిని ఎందుకు స్వీకరించ వలసి వచ్చింది? వైదిక సన్యాస విధులమీద నియమాల
మీద వారికి నమ్మకం లేనప్పుడు వాటిని వదిలి, వారు, బుద్ధుని వలెనో వివేకానందుని
వలెనో స్వతంత్రంగా ఉద్యమాన్ని సాగించి సొంత సంస్థను స్థాపించుకొని యుండ
వచ్చు. మఠ కామకోటి పీఠం వందలయేండ్లుగా వర్ణాశ్రమ ధర్మ పరిరక్షణ మనే
లక్ష్యంతో వ్యవహరిస్తున్నదని, ఆ లక్ష్యం కోసమే భక్తులు తరతరాలుగా దానికి కాను
కలిస్తూ పోషిస్తున్నారని అందరికీ తెలుసు. అటువంటప్పుడు వర్ణాశ్రమ ధర్మాలను నిరా
కరిస్తూ ఎవరైనా ఆ పీఠానికి అధిపతిగా ఉండవలె ననుకోవటం కేవలం అసంబద్ధం.
రాష్ట్రీయ స్వయంసేవక సంఘంలో గాని నక్సల్‌బారి ఉగ్రవాదులలో గాని చేరి, "నేను
మీ ఆశయాలను నియమాలను ఒప్పుకోను. అయినా మీకు నాయకుడుగానే ఉంటాను"
అని చెప్పటం ఎంత విడ్డూరమో ఇది కూడ అంతే. జీవన విధానంలో క్రమశిక్షణ
యొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించేవారు ఎవరూ దీనిని అంగీకరించ లేరు.

ఈ సందర్భంలో శ్రీ కృష్ణమణి శ్రీ శంకర భగవత్పాదులవారి వర్తనాన్ని
ప్రస్తావించడం చాల శోచనీయం. వారిట్లా అన్నారు- "ఒక సాధారణ సన్యాసి కూడా
ప్రవర్తించని విధంగా ప్రవర్తించిన మరో ఆచార్యుడు సాక్షాత్తు ఆదిశంకరులే. తల్లి
చావు బ్రతుకుల మధ్యలో ఉన్నప్పుడు. ఆది శంకరులు ఆమె వద్దకు వెళ్లి సేవలు చే
శారు. ఇది సన్యాసులు పాటించవలసిన నియమ నిబంధనలకు విరుద్ధం. మళ్లీ ఆయనే
తల్లి కర్మకాండ చేసినప్పుడు ఆమెకు అంత్యక్రియలు జరపటం కోసం కాషాయ వస్త్రాలు
త్యజించి తెల్లని వస్త్రాలు ధరించి మళ్లీ కొంతకాలం తర్వాత కాషాయ వస్త్రాలు ధరించా
రు. ఇది కూడ సంప్రదాయోల్లంఘనమే."

శ్రీ శంకర భగవత్పాదులవారే నియమోల్లంఘనము చేసినారని, వారితర్వాత
మరల ఇంతకాలానికి ఆ విధంగా చేయగలిగిన సాహసం జయేంద్రులకే కలిగిందని,
అది యేదో ఘనకార్య మైనట్లు శ్రీ కృష్ణమణి నిరూపిస్తున్నారు. వారిద్దరు కావించినది
సాహసమైనా కాకపోయినా శ్రీ కృష్ణమణి చేసింది మాత్రం సాహసమే.

అది శంకరులు తల్లికి సేవ, ప్రేతకర్మలు చేసినమాట నిజమే. అయినా

వారు, "కాషాయవస్త్రాలు త్యజించి శ్వేతవస్త్రాలు ధరించి మరల కొంతకాలం తర్వాత కాషాయవస్త్రాలు ధరించినా" అన్నమాట అపూర్వంగా ఉంది. శ్రీ శంకరులవారి జీవిత విశేషాలకు శ్రీ మాధవీయ శ్రీ శంకరవిజయమునే ప్రమాణంగా ఈనాడు పెద్దలు స్వీకరిస్తున్నారు. దానిలో 14 సర్గలో 46, 47, 48 శ్లోకాలలో ఆదిశంకరులు తల్లికి దహన సంస్కారము చేసినట్లు ఉన్నదే కాని కాషాయ వస్త్రాలు త్యజించి మరల కొంత కాలానికి స్వీకరించినట్లు లేదు.

ఇంక వారు సన్న్యాసధర్మానికి విరుద్ధంగా తల్లికి ప్రేతకర్మలు చేయటమనేది ఎందువల్ల సంభవించిన దనే ప్రశ్నకు సమాధానం వారు సన్న్యాసాన్ని స్వీకరించిన సందర్భంలోనే ఉంది. సన్న్యసించడానికి వారు తల్లిని అనుమతి కోరినప్పుడు, ఆమె, "శంకరా! నాకు దేహపతనం సంభవించినప్పుడు నీవు వచ్చి సంస్కారం చేయాలి. లేక పోతే నిన్ను కన్నందుకు నాకు ఫలమేమిటో చెప్పు" అని అడిగింది. అప్పుడు వారు "అమ్మా! పగలు గాని రాత్రిగాని నీవు ఎప్పుడు నన్ను స్మరిస్తే అప్పుడు వస్తాను; నీకు సంస్కారం చేస్తాను" అని ఆమెకు మాట ఇచ్చారు. కాబట్టి సామాన్యులవలె మమకారానికి ఆవేశానికి లోబడి ఆవిధంగా చెయ్యలేదని, వారు తల్లికి ఇచ్చిన మాటవల్ల ఆ విధంగా చేశారని స్పష్టమౌతున్నది. సన్న్యాసాన్ని విధించిన వేదమే "తల్లికి దేవతగా తలచియుండుము" [మాతృదేవోభవ] అని విధించింది; అట్లాగే ముందుగా "సత్యమును చెప్పుము" [సత్యం వద] అని విధించి తరువాత, "ధర్మమును ఆచరింపుము" [ధర్మం చర] అని విధించింది. ముందు సత్యాన్ని విధించి తరువాత, ధర్మాన్ని విధించడం వల్ల సకలధర్మముల కన్న సత్యము అధికమైనదని, ఎప్పుడైనా ఒకానొక ధర్మంతో దానికి వైరుధ్యము వచ్చినట్లైతే, ఆ ధర్మాన్ని ఉపేక్షించి సత్యాన్నే కాపాడు కోవలసి యుంటుంది. సాధారణమైన సత్యానికే ఇంత ప్రాముఖ్య మున్నప్పుడు మాతృదేవతకు ఇచ్చిన మాటను, ఏ ధర్మాన్నైనా వదులుకొని, నిలుపుకోవలెనని వేరుగా చెప్పనక్కరలేదు. కాబట్టి తల్లికి సంస్కారం చెయ్యవలసిన నియమం ఆయన స్వీకరించిన సన్న్యాసానికి ఆరంభములోనే ఏర్పడింది. అందువల్ల వారు చేసింది నియమ పాలనమే కాని నియమోల్లంఘనం కాదు.

అయితే, సన్న్యాస ధర్మానికి విరుద్ధమని తెలిసి కూడా వారు తల్లికి ఎందుకా మాట ఇచ్చారు? ఆ విధంగా తల్లి కోరినప్పుడు వారు సన్న్యాసాన్నే స్వీకరించకుండా ఉండవచ్చు కదా! కాని వారు అప్పటికే, మొసలి పట్టుకున్నప్పుడు, తల్లి యనుమతితోనే ఆతుర సన్న్యాసాన్ని స్వీకరించి యున్నారు. ఏ విధంగానైనా ఒక్కసారి సన్న్యాసాన్ని స్వీకరించిన తరువాత దాన్ని వదులుకోడానికి వీలులేదు. అందువల్ల తల్లి

ఇలాంటి మతం నేటి హిందువుల ఊహల్లో ఉంటే ఉండవచ్చును కాని, ఈ దేశంలో సృష్టియొక్క ఆరంభమునుండి ఉన్నది వేదధర్మం. అది సనాతన ధర్మం లేదా సదాతన ధర్మం : అంటే ఎల్లప్పుడూ మారకుండా ఉండేదని యర్థం. సనాతన మైన ఈ ధర్మాన్ని ఉద్ధరించడానికే భగవంతు డవతరిస్తున్నట్లు రామాయణాది గ్రంథాల లో వివరింపబడి ఉంది. ఈ గ్రంథాలలో నిరూపింపబడిన వర్ణాశ్రమాది ధర్మాలను విశ్వసించి యథాశక్తిగా ఆచరించేవారు., శ్రీరామకృష్ణాదులను అర్చించేవారు, హిందువులు కాగలరు కాని జీససును ఆరాధించేవారు అల్లాను స్మరించేవారు హిందువులు కాలేరు. వారు కూడా హిందువులని మనమనుకున్నా వారు అనుకోరు. వారు కూడా హిందువులే అని మనము అనుకొన్నప్పుడు వారితో కలిసి తినటము వివాహ సంబంధాలు చేసికొనటము తప్పు కాదు అని అనుకోవటం కూడా సంభవిస్తుంది. అప్పుడు జీససును ఆరాధించే వారితో చేరినవారిని వారు క్రైస్తవులుగా, అల్లాను స్మరించే వారితో చేరిన వారు మహమ్మదీయులనుగా మార్చుకోవటం సులభం. అప్పుడు వారి యాశయాలు ఫలించి హిందువులనే వాళ్లే మిగులరు. కాబట్టి ఈ విశాల దృక్పథం హిందువులకు ఆత్మహత్యే ఔతుంది.

ధర్మానికి, సమాజజీవనంలో వివిధ ధర్మముల సామరస్యానికి, ఉన్న భేదం గుర్తించక పోవటమే ఈ విశాల దృక్పథభ్రాంతికి కారణం. మన దృక్పథము విశాలమే, సందేహం లేదు. మనము ఎవరిని మతభేదం కారణంగా తరిమివెయ్యటం లేదు : బలవంతంగా మతాలను మార్చి వాళ్ల వ్యక్తిత్వాన్ని నిర్మూలించటం లేదు. సాంఘిక జీవనంలో మనం వాళ్లతో కలిసి మెలిసే ఉంటున్నాము. ఇంతమాత్రం చేత మనం సనాతన ధర్మాన్ని వదులుకోవలసిన పని లేదు. విజయనగర సామ్రాజ్యంలో చాలమంది మహమ్మదీయులు క్రైస్తవులు మహారాజులకు మిత్రులుగా అధికార పదవులలో కూడా ఉన్నారు. మొగలాయీలతో హోరాహోరిగ పోరాడిన శివాజీ కొలువులో ముస్లిం ఉద్యోగులు భద్రతతో ఉన్నారు. 1857 లో జరిగిన స్వాతంత్ర్యసమరములో నాయకత్వం వహించిన నానాసాహెబుకు విశ్వాసపాత్రులైన సలహాదారుల్లో ముఖ్యుడు అజిముల్లాఖాన్. ఈ సందర్భాలలో హిందువులు గాని ముస్లిములు గాని తమ మతధర్మాలను వదలకుండా ఉండడం గమనించ దగిన విషయం. ఝాన్సీలక్ష్మీదేవికి తోడుగా ఆ సంగ్రామంలో అయిదు వందలమంది పఠానువీరులు పోరాడారు. ఆమె చివరి దశలో "నా శరీరాన్ని మ్లేచ్ఛులు తాకకుండా చూడవలె" అని సాభిప్రాయంగా పఠాను వీరులవంక చూచింది. ఆ ఆజ్ఞను వాళ్లు శిరసావహించి ఆమెను ఆంగ్ల యోధులు తాకకుండా ఆమెకు కవచం వలె నిలిచి తుది వరకు పోరాడారు. మతధర్మ సామరస్యమంటే అది. ఎవరిధర్మాన్ని ఎవరూ వదులుకో లేదు. ఒకరి ధర్మాన్ని మరొకరు ఎంతో శ్రద్ధతో కాపాడారు. ఒకరి దృఢమైన ధర్మ విశ్వాసాన్ని మరియొకరు, మత

